శ్రీ

సద్గురవేనమః.

# సుజ్ఞానప్రతాపకీర్తనలు.

ఇది

పరమ భాగవతులైన శ్రీమత్ ఖండాఖండ సగుణ
నిర్గుణాతీత శ్రీసదానంద గురువరప్రసాద మట్టపల్లి
శ్రీలక్ష్మీనృసింహధ్యాన పరాయణులైన
శ్రీమాన్. కరాకొనరవరదాసుగారి
ప్రియ శిష్యుండగు
శేవల్లి - దానయ్యగారిచే
విరచితములై.

---

పోకల. వేంకటనరసింహారావునాయనివారి
సహాయమువలన
చెన్నపురి
డౌర్ - ముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రకటింపఁబడియె.



1908.



శిష్యుఁడు

శేవల్లి-దానయ్యగారు.





గురుఁడు.

శ్రీమాౕ. కరార్

నరవర దాసుగారు.

ఓం

శ్రీగురుభ్యోన్నమః

శ్రీమదఖండ సత్యపరిపూర్ణ బ్రహ్మణేనమః

## అవతారిక ద్విపద.

శ్రీమహాదేవుని సేవసంప్రాప్తి - నీమహిధర్మములింపు
గాఁజూడ। నవఖండపృథివి సామ్యంబుగు బ్రైటేఁగి- భవబం
ధరోగముల్ బాఱఁదోలి। దాసుండనని వేఁడి దాతకు బ్రమొ
క్కి - వాసిగాభారతి వదలక యెపుడు। భాసురంబుగను
హృత్పద్మమధ్యమున-న్యాసఁబూనించెఁదా జాగ్రతగాను।
చంచలత్వము లేక చపలుఁడనుగాక - సంచితావ్యక్తము
నునమసిపోవుటకుఁ। పార్వతీపతిపాదపంకజములకు - స
ర్వకాలము శరణుసల్పితినయ్య। సర్వంబునీవనుసంకల్ప
మునను-గర్వంబువిడిచిసద్గతిఁబొందవలసి।యష్టదిక్పాలు
రయనుమతింబొంది- యిష్టమహాఋషుల నీసృష్టిలోపలను।
కశ్యపగౌతమ గార్గేయవసిష్ఠ విశ్వామిత్ర కపిలకణ్వ
దూర్వాస కౌండిన్య భారద్వాగస్త్య వాల్మీకమాండవ్య
వ్యాసభాస్కరభుజండ నారాయణభృగు నారదతుంబురు
మఱిమతంగమహాని శౌనకాది మొదలగు మహాత్ముల మ
హోత్సవమునఁ గాళిదాసమహాకవిపుంగవుల। దీవెనల్
బొందియుఁగొందర లేక - సావధానుండనై సమరసంబున
ను। శేవల్లివంశమునఁ జెన్నొందఁగాను- భావింపఁద్రిపుర
సుందరివరముచేత। దేదీప్యనృసింహ జ్యేష్ఠపుత్రుండ-
శోధింప సాయమాంబగర్భమున। చరనాబ్జదాసునైజన్నిం
చియుట్టి - ధరణిలో సద్గతిదారిఁజెందుటకు। వరగురువరవ
రార్యులను జేరి- మఱిజన్మలేకుండ మఱిఁజేయుమనుచు।

వినయంబుగనుజతుర్విధమైనశుశ్రూషలను జేయుచుం
టినిరూఢిగాను। తనుమనోధనము పాదములకర్పించి-విన
యవిదేహినై విన్నవించఁగను। గరుణాకటాక్షంబుగల్గి
నాసద్గురుసాలోక్య సామీప్యసారూప్యమును సాయుజ్య
సార్ష్టిత్వవిదేహకైవల్యములనునాఱుపదములనమరఁజూపి
ధీరతఁజెల్వొంద దిగ్దశలునుప్పొంగఁ। బరిపూర్ణభావము
నుపద్ధతిలెక్కఁగింప।నండపిండాండబ్రహ్మాండభాండములు-నిం
డుకొనియుండు నఖండమహిమను।నింతకుమిక్కిలియిఁక
లేదటంచు - శాంతిపఱచె షోడశాక్షరినిచ్చి। చింతలురం
తులుగంతులుమానితి పంతముపోయెను పరగఁజూడశివుఁ
డేజీవుండాయె జీవుఁడాత్ముండాయె। చావుపుట్టుకమాటస
మసిపోయె। నిదియెనిజగురుపదంబని నిశ్చయించిమదో
నత్తునై స్ఫురియింతు మాంపాహిపాహి॥

| కీర్తనసంఖ్య. | రాగము. | తాళము. |
|---|---|---|
| 1. | ధీరశంకరాభరణము. | ఆది. |
| 2. | శహాన. | ఆది |
| 3. | సురటి. | ఏక. |
| 4. | నాదనామక్రియ. | ఆది. |
| 5. | కల్యాణి. | రూపక. |
| 6. | గజల్. | అట. |
| 7. | నాటకురంజి. | రూపక. |
| 8. | గజల్. | అట. |
| 9. | పంతువరాళి. | ఆది. |

| సంఖ్య. | రాగము. | తాళము. |
| --- | --- | --- |
| 10. | రేగుప్తి. | ఏక. |
| 11. | సురటి. | రూపక. |
| 12. | హిందుస్థానికాపి. | రూపక. |
| 13. | సౌరాష్ట్రము. | అట. |
| 14. | శంకరాభరణము. | ఆది. |
| 15. | కాంబోది. | రూపక. |
| 16. | ఆనందభైరవి. | అట. |
| 17. | కేసరి. | చాపు. |
| 18 | రేగుప్తి. | అట. |
| 19. | సావేరి. | ఆది. |
| 20 | నాదనామక్రియ. | అట. |
| 21. | సావేరి. | రూపక. |
| 22. | కాపి. | జంపె. |
| 23. | నాదనామక్రియ. | చాపు. |
| 24. | సౌరాష్ట్రము. | ఆది. |
| 25. | ముఖారి. | ఆది. |
| 26. | ముఖారి. | చాపు. |
| 27. | కోకానళి. | ఆది. |
| 28. | జేగడ. | రూపక. |
| 29. | మోహన. | ఆది. |
| 30. | ధన్యాసి. | చాపు. |
| 31. | సౌరాష్ట్రము. | చాపు. |
| 32. | మోహన. | రూపక. |

| కీర్తనసంఖ్య. | రాగము. | తాళము. |
| --- | --- | --- |
| 33. | ముఖారి | ఆది. |
| 34. | శోనేరి. | చాపు. |
| 35. | నాదనామక్రియ. | అట. |
| 36. | యమునాకళ్యాణి. | ఆది. |
| 37. | ముఖారి. | త్రిపుట. |
| 38. | ముఖారి. | అట. |
| 39. | తోడి. | అట. |
| 40. | బేగడ. | త్రిపుట. |
| 41. | కళ్యాణి. | రూపక. |
| 42. | కేసరి. | జంపె. |
| 43. | నాదనామక్రియ. | అట. |
| 44. | బేగడ. | త్రిపుట. |
| 45. | యదుకులకాంబోది. | ఏక. |
| 46. | హిందుస్థాని కాపి. | రూపక. |
| 47. | ఆనందభైరవి. | జంపె. |
| 48. | నాదనామక్రియ. | త్రిపుట. |
| 49. | భ్యాగ్. | ఆది. |
| 50. | బేగడ. | త్రిపుట. |



శ్రీగురులింగమూర్తినేనమః.

# సుజ్ఞానప్రతాప కీర్తనలు.

గురుర్బ్రహ్మాగుర్విష్ణుర్ గురుదేవోమహేశ్వరః।
గురుసాక్షాత్ పరబ్రహ్మం తస్మైశ్రీగురవేనమః॥

## సద్గురుస్తుతి.

సీ॥ సద్గురుపుత్రుండు సాధు సన్మిత్రుండు
నిర్గుణస్తోత్రుండు నిర్మలుండు।
మోక్షాధికారుండు సాక్షాత్సుభక్తుండు।
సూక్ష్మాదిరూపుండు సుందరుండు।
వినతాంతరహితుండు వేదాంతసారుండు
సర్వసంపూర్ణుండు సాత్వికుండు।
వరకవిజానుండు నరవరదాసుండు।
పరమదయాళుండు బ్రాహ్మణుండు।
అట్టితపసిపల్కు లానందమైయుండు।
జననమరణరహిత జాతిపండు।
తిన్నవారికెల్ల దీపులుమెండగు।
దొరకదల్పులకును దొడ్డపండు॥



## వినాయక ప్రార్థన.

శ్రీగణనాథహృదయేశ్వరీ చిత్తమునన్ భజియింతు, నెప్పుడున్ శివాతనయుపార్వతీపుత్ర సుజనమిత్ర కళత్ర యోగజాననసీకుమ్రొక్కెదన్ బాగుగకృత్యాకృత్యజాడ్యముల వెడఁబాఱఁదోలు మటంచుముందుగన్ గాఁగల కార్యక్రతువులకెల్లన్ వెనుకగద్రీమునీవెయని యంజలిఁ జేసివేఁడెదన్ జాగుసేయక నిరంజనాద్భుతాకారపవిత్ర గోత్ర ధాత్రి విద్యలకెల్లన్ సూత్రధారివని స్తోత్రముఁజేసి నుతించి వేఁడెదన్ వేగమెనీకరుణామృతరసమిందుఁగల్పించివాత్సల్యమునన్ వరుసతోనేలుమటంచువిన్నవించితిన్ విఘ్నవినాయక పాదనమస్తే నమస్తే॥

## సరస్వతీ స్తోత్రం.

వందనమాచరింతుశుకవాణికి పల్లవపాణికినాదుముద్దు భ్రమరాంబకున్ వందనమాచరింతు నలివేణికి సరస్వతీ దేవికి మార్తికాంబరధారికిన్ వందనమాచరింతు నానంద ముతోడన్॥

---

## అంబస్తుతి.

అంబా ఆదివిరాట్ జగదీశ్వరి మహేశ్వరి భగవతి అద్వైతవిద్యాంసిని అంబా కాళిభగాళిజనని జగన్మో

హీని ఖండిదుర్ధండి కళ్యాని విను - అంబా - అఖండ తేజ చిద్రూపి రుద్రకి ప్రచండ భానుకోటి త్రిపురసుందరీవిను అంబా-నినునే వర్ణించెద ముదంబున నావాక్కునుండి శోడుపల్కవె పద్మసుగంధి లోకనాయకీ నమో నమో॥

## కీర్తన 1.

1. స్తుతించితినిగణనాయకా। గతిపతినీవనియెడఁబాయక । అతులితముగసద్గతిఁ జూపుముగో । పతిధ్వజాశివ సతిసుతుఁడనినే॥ స్తు॥ విద్యలకెల్లఆధారము సత్ శ్రుతిప ధ్యములకు నీకారము।విద్యాబుద్ధులసాధ్యపడుదువనితథ్య ముగను నాద్యంతభక్తిచే॥ స్తు॥ హరీసురనుతా సవితా కరిగిరిదరధారశోభితా । వరముప్పదిముక్కోటిసురలలో స్థిరముగనినునేమఱిమతిముందుగ॥ స్తు॥ సనకసన్నుతపరి పాలనా గుణగణనంశాబ్ధిసుచేలనా । అనుదినమునుమన మునసుమఱువకమననఁజేతు మాంపాహిపాహీయని॥ స్తు॥ చావుపుట్టుకలేదని గురుసేవకువచ్చితిఁబ్రోవుమి। నవఖవ ఖండము చవిగొనిప్రేమఁగ భువనమండలము రవిగొను బుధులను॥ స్తు॥ ముదలంబలసంస్మరించెద సత్పదంబు లనుమదిభజించెద। వేదార్థముగరుచిపదార్థమీవని సదానీసేవకునిదానముననే॥ స్తు॥ గురుపరంపరావాసుఁడౌ నరవరాహార్యవిలాసుఁడౌ । ధరచరనాబ్జదాస వరదసంస్థ రణఁజేతుగజరాజగావుమని॥ స్తుతించి॥

## కీర్తన 2.

2. బాలాత్రిపురసుందరీ పాలించవే॥ బా॥ చాలా యీవేలనడినాళసుశీలశ్రీ॥ బా॥ శృంగారసీలవేణినామ నమునఁబొందుచునుండుఁబూని।గంగాప్రసంగవిమలాంగ అంగనామణి॥ బా॥ ఇందురమ్మనిపిలిచితి చందనసుగంధి వనిదలఁచితి। అందిపొందకయున్న చాయనేఁ గందుముం దు॥ బా॥ పల్కవేమిసేతును ప్రబలముఁబల్కించునేత్రా తును। కల్కిచిల్కలమృదుకొల్కిఅమృతమొల్క॥ బా॥ నమ్మియుంటిపాదము భవములఁ జిమ్మివేయుమోదము। కొమ్మారావమ్మముద్దుగుమ్మా మాయమ్మవేగ॥ బా॥ అండఁజేరితిఁ బ్రోవుమీ-బ్రహ్మాండ భాండోదరిగావుమీ। ఛండిచాముండి దుర్దండిప్రచండిఓం॥ బా॥ ప్రాణిపోకముందుగా రక్షించుప్రాణంబునీదందుగా । వాణిపుపుఁబోణి శివరాణి చిద్రూపవేణి॥ బా॥ మునివినుతల్లివాణి ప్రొక్కెదచరనాబ్జవల్లభునీ। చరాచరంబరివరాపురందరీ॥ బా॥

## కీర్తన 3.

3. తల్లీ భారతిగావుమీ ప్రొక్కెదకల్పవల్లి శారద ప్రోవుమీ। ఎల్లలోకములేలు సజ్జనమల్లికార్జును రాణి రాఁగదె। చల్లగనుసీభక్తకోటిని।నుల్లమలరఁగ నేలుమని శోభిల్లఁగను నాఆత్మలోరంజిల్లఁగనుభజియించితిని శ్రీఓం. రీం ఓంకారదుగీ॥ తల్లీ॥ లంబోదరజననీ బింబోష్ఠి శ్రీ

శంభువినుతపాదినీ అంబుజాక్షిరోనిన్ను బల్ మోదంబు
ననువివరించి ఋషులునుతుంబురు నారదులు మొదలగు
కుంభినినద్వైతులెల్ల సంభ్రమముగ దరిఁజేరినారని కంబు
కంఠిరోదెలసికొలిచితి ఓం రాం ప్రణవస్వరూపిణి॥ తల్లీ॥
జననీపంకజనేత్రి ముజ్జగములేలు భగవతినమ్మితి ధాత్రి।
జ్ఞానసంపూర్ణముగనీపద ధ్యానమును నేఁజేయఁబూనితి।
వాణిపల్లవపాణిసద్గుణవేణి పుస్తకపాణి కిరాతరాణివై నివ
సించి సత్యభానుని కాపాడుశాంభవి ఓం క్రీం బ్రహ్మస్వ
రూపిణి॥ తల్లీ॥ కమలాబ్ధి గుణకామిణి ద్వాదశపుంద్ర
విమలాక్షి జగన్మోహినీ। నామరూపములేక సత్యభా
మవై జగమెల్లమింగియుఁ బ్రేమమీఱఁగనున్నావని।
పరస్వామిదెల్పఁగఁబూనిమనమునఁ దామసంబింతైనలేక
నుకోమలాంగిరొగొలిచిపిలిచితి ఓంశ్రీం ప్రచండరూపి॥త॥
బంధమోచనరాణివే నీదానుల బృందమందునఁ జేర్పవే
యిందువదనను చంద్రబింబముముందుగను శరణొందివేఁ
డెద నెందుఁజూచినసందులేకను నుందువనిమదిపొందుపఱ
చిన బిందునాదకళాతీతం బంది నాచరణాబ్జదాసానందునిఁ
బ్రోచినరుద్రకి ఓంక్లీం అఖండరూపి॥ తల్లీభారతి॥

## కీర్తన 4.

శ్రీపరమేశాయనమోనమో। హరశ్రిత కంధరధరన
మోనమో। పాపవిమోచన పరమదమోచన।త్రిపురాం

తకప్రభునమోనమో॥ శ్రీ॥ కనకాంగ్రిజహారే నమోన
మో। ఘనమునిజనపూజిత నమోనమో। ఇనకులాధీశ
ఫణిశయభూష సనకసన్నుత హారేనమోనమో॥ శ్రీ॥
త్రిజగద్వందిత నమోనమో। అజసురార్చితపద నమోన
మో। రజతగిరీశసుజనసుభూష అసమతేజహారే నమో
నమో॥ శ్రీ॥ నీలకంఠతేనమోనమో। వనమాలికాభరణ
తే నమోనమో। ఫాలనేత్రతే ప్రవిమలగాత్రతే శూలి
వినుతమురనమోనమో॥ శ్రీ॥ నందివాహనతేనమోన
మో శరదిందు వదనతేనమోనమో। చంద్రశేఖరా
మరేంద్ర సన్నుత కుందరదనతేనమోనమో॥ శ్రీ॥ గౌరీ
వల్లభతేనమోనమో గంగాధరరుద్ర తే నమోనమో।
సరసిజధృతకర సర్వేంద్రియహర। ధరామరార్చితనమో
నమో॥ శ్రీ॥ బసవపాహిమాంనమోనమో కసురాంతక
మృగధరనమోనమో। ఈశవినుతచరణాబ్జనుతదాసవర
దతే నమోనమో॥ శ్రీపరమేశాయనమోనమో॥

## కీర్తన 5.

శ్రీమహానవరత్నముకుట శ్రీమహాగురుపాహి। నీమ
హిమను దెలియుటకును నెవరితరమ ఓయీ। మునిస
న్నుత యనుదినమును ఘనముగ సేవించితి పనిఁబూనియుఁ
బార్వతీపతి పాదములు భజించితి॥ శ్రీమ॥ ధీరసద్విచార
మాని దీనజనకృపాంబుధీ పరమపురుషభవ్యచరితపన్నగా

భరణాంబుధీ॥ శ్రీమ॥ భక్తిదెలసినిన్నుఁగొలిచి భరముల దూఱఁ ద్రోసితి। ముక్తిఁజెందకేమి నిన్నుముటియుచుఁ గని పాడితి॥ శ్రీమ॥ వాచామగోచరశివ, దాసదాసదాసుఁడఁ జూచి నన్నుఁబ్రోవుమిపుడె సునుతపరవాసుఁడా॥ శ్రీ॥ చరాచరంబు హరనిరంతరాంతరా వరచంద్రాబ్జ దౌర మొనువినుపరాత్పర॥ శ్రీమహా॥

కీర్తన 6.

వందనముశ్రీ గౌరీనాయక నందివాహన సురనుతా। ముందునీకుశరణుశరణిక నందఁజేసెదమునిసుతా॥ వంద॥ గంగాధరత్రికూటనిలయ భృంగసంగమహేశ్వరా-లింగ భవభయరంగరాడ్గమిజంగ మాజగదీశ్వర-అగరుపన్నీరు చందనత్తరు సొగసుమేనెల్లఁబూసెద। నిగమగోచర - అగమతేజ నీ నగుమొగము నేఁజూచెద॥ మల్లెమొల్లలు కొల్లగను మదినుల్ల మలరఁగఁ జల్లెద ॥ వందనము॥ ధూపదీపనైవేద్యములను తేపకర్పణఁజేతును - ఓపిశిరము నుమోపినాదు కోపతాపము గోతును॥ వంద॥ మున్ను భక్తునేలినావని విన్నపంబౌకటంటిని । పున్నమవెన్నెల బయలుభావముతిన్న తిన్నగఁగంటిని॥ వంద॥ వాసిగనునీ దాసుఁడను ననుదోషమెంచకనేలుమీ। భాసఁజేసితినీదు చరణముధ్యాసమఱువను నేలుమీ॥ వంద॥ ధరనుశ్రీచ న్ద్రాబ్జకవి బిరుదాళినీవంటిని। అరమరేలనుకరుణఁజూడుమి చరణముల గుదుగొంటిని॥ వందనము శ్రీగౌరీనాయక॥

## కీర్తన 7.

శ్రీవిమలక్ష్మీనాథా - నా - మనవిచేకొనరాదా । నవ
మోహనహార - నరపతిసురనుత - భువనమండలభృం
గవరేణ్యాశివ॥ శ్రీవిమ॥ ఈశబృందావనమాలి నీ దాసదా
సుఁడనుశూలి । దశదిక్పాలకపశుపతి పరశివవృషభేశ్వర
నిన్నాసించితినిఁక॥ శ్రీవిమ॥ విధికర్మములనుబాపు- నా -
మదినీపదములమోపు । ముదమునభక్తుల హృదయపద్మ
మునసదయుఁడవై నివసించిన సద్గురు॥ శ్రీవిమ॥ కన్నసు
తునివలెఁజూడు- నా-విన్నపమునువినినేఁడు ।పన్నగభూష
ణసన్నుతాంగప్రియ యెన్నతరమనీచిన్నెవన్నెలను॥ శ్రీ॥
అనుమతినొసఁగనురావా - ఓ-దీనరక్షకాదేవా । అనుది
నమునుమనమునను మఱువకగుణములోఁ గొలిచెదఘన
వంశాబ్ధికా॥ శ్రీవిమ॥ దండమిదిగో క్షవశాంగ - దాస-చర
ణాబ్జనుతాంగా । కుండలిధరనీయండఁ జేరితిఁక దండధరు
నిచెండాడిదున్నుటకు॥ శ్రీవిమలక్ష్మీనాథా॥

## కీర్తన 8.

దండమయు వేదండనాయకా పండితాభరణా । అండ
పిండాజాండములు నిండినయఖండ భవహరణా॥దండ॥మా
ధవార్చిత ఆదిప్రణవ వేదగోచరుఁడా। సాధుజనవినోద బు
ధవరపాదమిడవేరా॥ దండ॥ ఈశభవభయ నాశఅవగుణ
దోషమెన్నకురా । కోటిశశివగరేశ శ్రీ శివదాసపోషకుఁ

డా॥ దండ॥ ఫాలనేత్రసుశీలసద్గుణ జాలమేలనురా। పాలఁ బడితిఁక నేలవలెనట కోలహాలమున॥ దండ॥ కొంచెగాఁ డంటంచు నీమది నెంచఁబోకుమురా। సంచితములానించి నీకృప - నుంచిప్రోవుమురా॥ దండ॥ పంతగించనీకింతకోపమె ఏకాంతమునరారా। శాంతముననీ చెంతఁ జేరితిఁ జితఁదీర్చుమురా॥ దండ॥ నిన్నుఁగొలిచియిఁక ధన్యులయిరనిచిన్న లెఱిఁగితినే। మున్ను భక్తులఁ-గన్న వాఁడని నిన్ను నమ్మితినే॥ దండ॥ గతియునీవని - సతతమును మది-స్తుతియుఁ జేసితిఁగా। పతితపావనకీర్తిని నీసరిపతియునెవరుగా॥ ఎంచరానిప్రపంచమును నిడఁద్రుంచియెంచితిఁగా। మించి సద్గురు పంచఁజేర నాశించిపొంచితిఁగా॥ దండ॥ బృందశ్రీ చరణాబ్జదాసానంద మందిరయా। సుందరమున నుచందనమునుదుట నందముఁగ మెఱయు॥ దండ॥

## కీర్తన 9.

పాలించవేలా ప్రాణలోలపరాకేల పరిపాలించవేలా. చాలఁగానేనేరిఁ మఱిమఱి ఫాలలోచన ప్రస్తుతించితిఁక॥ పుత్త్రినిఁజంపి భుజింపఁజేసిన। చిత్రమువినినీపాత్రుఁడంటి పరి॥ పాలించ॥ హితవుదెలిసిన సుమతిమానిసుత। గతుని బ్రోచినపతివని భ్రమసితి॥ పాలించ॥ వాసవవందితాబ్ధీశ పరాత్పర। యాశించితినను మోసముసేయక॥ పాలించ॥ ఏరినీసరివారునునిఁక భువి। లేరటంచునీభారమంటిశివ॥ పా॥

నిరాకార సర్వ బిరానఁబ్రభోవుసచ్చరణాబ్జ సంస్మరణాద్భుతా॥ పాలించ॥

## కీర్తన 10.

శ్రీగురుపరబ్రహ్మదేవా నన్ను రక్షించుమహానుభావా। బాగుగనీసేవ భోగంబులను గోరివేగమొచేసితి రాఁగదె ప్రాణేశ॥ శ్రీ॥ తనుమనోధనములర్పించి నేర్పుతోడనీపాదముఁగాంచి। ననువినీతునిఁజేయు మనసున నోయని వినయవిధేయత విన్నవించితి తండ్రి॥ శ్రీ॥ పంచేంద్రియములనుబట్టి నాదుకించిత్వములవిడఁగొట్టి। యుంచితభక్తితోనెంచిమాడఁగ నిన్నుసంచితభవములను ద్రుంచిదున్నాడనా॥ శ్రీ॥ ఇంతకఠినమేలప్రోవ దంతి వరద నాపాలను లేవా। పంతగించుటతగదు సంతోషకర నేఁడు। రఁతులెల్లఁబాపు మనంతకోటినామ॥ శ్రీ॥సర్వంబునీదని యంటి పూర్వజ్ఞానంబుచేనిన్నుఁగంటి। సుర్విలో నినుఁదెలియనోర్వ లేరొకరైన నిర్వికారుండవని నిత్యముభజించెదను॥ దాసజనపరిపాలపోష నన్నుదూషించకు ముక్తితోషా। వాసిగాచరణాబ్జదాసా పరంపరా। వాసరక్షించు జగదీశ మొఱ్ఱెకైదనేఁడు॥ శ్రీగురు॥

## కీర్తన 11.

ఈశపరాత్పరరారా । భవనాశనహరశివ॥ఈశపరా॥ ఆశించితిననుమోసముసేయకుదాసవరదయిటురారా॥భ॥

మక్కువగనునీచక్కనిపదముల ప్రొక్కెద నేడిటురారా॥
భవబంధములనుయువచేదోలను రవితేజోత్తమ గారా॥
కన్నతండ్రివని విన్నవించెదను దిన్నఁగ నీవిటు రారా॥
కుండలిభరణా ఖండతేజశ్రీ పండితోత్తమ యిటురారా॥
ధరలోనినుఁగనుమలుగు దెలియుటకువరగురుఁ జేరి రారా॥
నిరాకారసర్వ బిరానఁబ్రోవు సుస్థిరముగ వేఁడితి రారా॥
అవనిని శ్రీచరణాబ్జకవికృతి చవిగొని వినుటకురారా॥భవ॥

## కీర్తన 12.

అంబికాపనాథనను నాదరించిప్రోవరా। సాంబసత్య పూర్ణ భావసారమిచ్చి గావరా॥ అంబి॥ నీలకంఠనిన్నువి డిచి నిమిషమైనఁదాళరా। ఫాలనేత్రజాలమేల పాలించి నన్నేలరా॥ అంబి॥ కామక్రోధములనుబట్టి కండకండలు గోసితి। నామభజనవలననిత్యానంద రూపముఁజూచితి॥ ఆశాపాశములనుగోసి దోసిలొగ్గినానురా। దూషించకు నీదుభక్త దాసానదాసుఁడనురా॥ అంబి॥ ఎందతెగ్గుసే యుచున్న నెఱుకమఱువవలెనురా। ఇందుధరనాయందు నీదయపొందు నెన్నదుపల్కరా॥ అంబి॥ పరశివనీపాదాబ్జ ములఁబట్టితి మాదేశికా। ధరణి శ్రీచరణాబ్జదాస వరదుని కవిపోషకా॥ అంబికా॥

## కీర్తన 13.

ఏలయీాచలమేల శ్రీలోల-మునిజన పరిపాలనుశీలసద్గుణ శీల ఋషిఖేలా। చాలగాబతిమాలుచున్న మేలుగానా

జోలివిన వేలక నక చేలా। హృదయలోలజాల మేల బాల॥ఏ॥
శంక రాశివపంకజ నాభా ఓంకారరూప కళంక మేలను శంక
దీర్పువిభూ। వంక లెన్న ఁభోకుయమ కింకరులపాలన్నీయకు।
పొంకమలరజంకుదీఱ అంకులుమాన్పిన దేవ॥ ఏల॥ ఇందు
ధరనీవిందు గాగదరా। నాయందునీ పయపొందు నెన్నడో
ముందుదెల్పుమురా । ఎందెందుఁజూచిన నీవెనందు లేక
యుందువనియందముగ వేఁడితిని నిందువదన కుందరదనా॥
గంగాధరనీరంగు దెలిసితిరా । శృంగారనయనభంగభవభ
యలింగవలచితిరా । అంగజాజనక వేగ రంగుగానామన
మునఁబొంగుచు వేఁడితిగదరా సంగమైన-చోటనిన్ను॥ఏల॥
దంతివర దాపంతమేలరా శ్రీకాంతవినుతా। చింతదీర్చి చెం
తఁ జేర్చుమురా । వంతు కెక్కి సపరిపూర్ణం బంతనిండియు
న్నదని చింతఁ జేసిపరమభక్త సంతఁతిగనుఁగొన్న దేవ॥ఏ॥
వాదభేదము బాధవదలితిని సద్గురునరవరుని బోధలోనే
మోదమొందితిని। నాదమేవినోదమని సాధనసంతుష్టినొం
ద। శోధనఁ జేయుచు నాత్మబోధనుగనుగొన్న దేవ ॥ఏల॥
ఈశభవభయనాశ ప్రోవుమురా। శ్రీశైలవాసదాసరక్ష
కాధీశ గావుమురా। ఆశాపాశములనుగోసి దోసిలొగ్గియు
న్న చరణాబ్జదాసపోష చిద్విలాసముక్తితోషహార ॥ఏల॥



## కీర్తన 14.

రాజలింగం ప్రభు రాజలింగం ప్రభు రాజలింగం ప్రభురా వోయీ। అజహరిరుద్ర ప్రజాపతివీవని। నిజముగఁ దెలిసితి ద్విజపరిపూర్ణక సుజనప్రబోధక గజచర్మాంబరభజియిం చెదనినురావోయి॥ రాజ॥ సారములేని సంసారములోఁ బడి। కోరిసేవించ నేరనయా దూరభారములేక। చేరిర క్షించ వేసారివేఁడితి నిటు రావోయి॥ రాజ॥ చపలుఁడ మూఢుఁడ కపటచండాలుఁడ। కోపమధికమగుతామసుఁ డ। విపరీతుఁడ నని నెపమెన్నక గోపతివాహన యిటురా వోయి॥ రాజ॥ కూటికొఱకు బహుమాటలుగాచితి వా టముగా। కలిబూటకనరులచే సూటిగానుద్రికూటనిలయ రవి కోటిప్రకాశారావోయి॥ రాజ॥ శేషభూషణజగదీ శ సౌఖ్యముఁజూపి వాసినేలుమీ। చిద్విలాసము నా దా సుల దూషించు దోషకులను బట్టి భూషింపవేగమే రా వోయి॥ రాజ॥ గంగాగౌరీప్రియవ రాంగశుభాంగయని పొంగుచు వేఁడెద శృంగాటకమునవే రంగుగనరవరలిం గనిమఃఖువను సంగమేశ్వరవేగరావోయి॥ రాజ॥ కాశిగ యాప్రయాగాది దేశములఁదిరుగఁ। గాసైనలేదేమి చేసె దను। ధ్యాసఁబూనిసచరణాబ్జకవీశ పోషదాసరక్షకవేగ రావోయి॥ రాజ॥

## కీర్తన 15.

నీవేదిక్కనినమ్మితి నేవిధమునైనను బ్రోవవేనీసమ్మతి। నీవేదిక్కనినమ్మితిని నాభావమునశ్రీదేవదేవ। కేవలంబగు నాకునొక్క బ్రోవఁజూపిగావుస్వామి॥ నీవే॥ ఎన్నతరమ ప్రతాపము వున్నమవెన్నెల నున్నది స్వరూపము-తిన్న గాఁద్రి వేణిసంగము సన్నదిడ్డి నిన్నెచూడఁగవన్నెచిన్నె లన్నిమీఱి యుండు వనిమదిఁ గందునోశివ॥ నీవే॥ కపట ముంచకుశంకరా అపరాధిననుచు నెపములెంచకుకృపి కరా। ఉపముచేనైదక్షరముల జపముసేయఁగఁదపము హెచ్చెను సఫలముగనిఁ జేరినప్పుడె చపలముడిగెనుగృ పకుఁబాత్రుఁడ॥ నీవే॥ భక్తజనపరిపాలకా భవనాశజీ వన్ముక్తి నొసఁగుముదేశికా। ముక్తికొఱకై పాదముల సంయుక్తముగఁ బూజించెదనే రక్తిచేసి నామస్మరణ శ క్తికొలఁదిగ యుక్తిదెలుసుక॥ నీవే॥ సురలనేలినరీతిగాఁ వరమునులఁబ్రోచి ధరణిలోఁబ్రఖ్యాతిగా-కరుణచే మా ర్కండమౌని వరదునిఁగాపాడికాలుని బిరుదులణఁచిన హరుఁడవనుచును శరణుచొచ్చితి వరములీయరా॥ నీవే॥ స్థైర్యముగ నీసూత్రము ఆర్యులుచూపఁ జూచితివిచిత్రము కార్యాకార్యములకు గొప్పవీర్యమైనది పూర్ణమేవ। స్థ ర్యముగ చరణాబ్జగురుగాంభీర్య వరచాతుర్యుఁడావె॥ నీ॥

కీర్తన 16.

రారశ్రీగౌరిమనోహర సద్విచారమునినుత ధీవరా । కారణకార్యానుభవకరభక్తిదారవోసినశ్రీగురువరా॥రా భక్తవత్సలనిన్ భజించితి సోహంయుక్తిదెలసినేసాధించితి। శక్తిగుదిరిశిరమునోంచితి శరణుముక్తిప్రదాయనిన్ గాంచితి॥ రార॥ ఆనందరూపమీవంటిని కేవలానందమే కనులఁగంటిని పూనిసద్గురు సేవఁగొంటిని నిండుపున్నమ వెన్నెలఁగంటిని॥రార॥ సర్వంబునీదని వేడితి । దుష్టేచ్ఛలనువిడనాడితి । నుర్విపైఁగృతిఁగూర్చిపాడితి । స్వీకారనీభక్తులఁగూడితి॥ *రార॥ శృంగాట నిలయమేయన్నారా । దేవసంగప్రసంగమువిన్నారా । లింగానిన్నేగోరియున్నారా। పద్మభృంగనీ పదములఁగన్నారా॥ రార॥ సురనుతగిరిజామహేశ్వరానరచరణాబ్జదాసప్రశంతీశ్వరా। గరళమారగించినయీశ్వరా।నన్నుకరుణఁజూడుము జగదీశ్వరా॥ రార॥

కీర్తన 17.

రక్షకానీభజనక్షోభక్త్యైయిచ్చి నోనియున్నానయా అక్షయకరుణాకటాక్ష విలక్షణాద్భుత చిన్మయా॥ రక్ష॥ సాంబసద్గురుపాహి మమగురు - శంభోకంధరశంకరా। కుంభసంభవజృంభకరి చర్మాంబరాశ్రీపుష్కరా॥ రక్ష॥ సర్పభూషణ సర్వేశ్వర దర్పహారదరిఁజేర్చరా । నేర్పుగను నీభక్తగణములోఁ గూర్చి కోరిక దీర్చరా॥ రక్ష॥

రుద్రవేసీపదములనుమది సుద్రుతమువిడనాడరా। చిద్రూపనిశ్చలనిద్రలోననుభద్రముగఁగాపాడరా॥ రక్ష॥ గంద్రగోళముబాపుమీ। అమరేంద్ర సద్గుణభూధరా। ఇంద్రచంద్రగజేంద్ర సురయోగీంద్ర పూజితశ్రీధరా॥ రక్ష॥ శిష్టప్రభువని మనముననుసంతుష్టినొందిఁకవేఁడెద। అష్టమదముల నిష్టలణఁచి శ్రేష్ఠముగఁనిఁక బాడెద॥ రక్ష॥ పగలు రేయనరాక వెల్గెడు అగణితసుగుణాకరా। దిగులుదీర్చియుబుగులుబాపవె నిగమగోచరశుభకరా॥ రక్ష॥ వందనము చరణాబ్జ హృదయా నందభరిత చిదంబరా। సుందరాంగసునందివాహన కుందకుట్మదిగంబరా॥ రక్ష॥

కీర్తన 18.

రక్షింపఁగదమహాచార్యులు - జగద్రక్షకులగుదేశికార్యులు। పశ్చాత్తాపము లేక సుక్షేత్రవాసుఁడై। వీక్షింపకయుగురు దీక్షఁజేసిఁకనన్ను। మోక్షమునకిదిమూలమనియపేక్షలువదలించి పిదపసూక్ష్మములోఁగడ తేర్చినాడు। శిక్షలను వదలింపఁగురుఁడు॥ రక్షి॥ భూతిపుండ్రము నొదుటఁబూసెను - బ్రహ్మదాతవ్రాసినవ్రాలుదీసెను అతులితమునవస్త్రహితమును ధరయించి। మతిమంతుఁడవంచు మఱియుశిరమునఁ గరమునుంచి। నూతిలోఁబడువానిగుంజి నరీతిగానాతపసిమంత్రం। ఖ్యాతిగాకర్ణమునఁ జెల్పగ ద్యోతకమాయెనంత॥ రక్షి॥ నూటిత్రికూటము నందుంచిరవి-

కోటిప్రకాశము శోధించి। సూటిదప్పక పైపీఠము నందున్న తేఁటగా వెలిగెడు బోటిని బొడఁగాంచి। సాటిసుగుణము మన మున సద్గురుని వాక్యము బాయకుండ వాటముగఁ గలిమా యనుబహు బాటఁ జేసినంతటగురుఁడే॥ రక్షి॥ పంచవింశ తితత్వాలెఱిగించె పూర్వసంచితభవములఁ జెరగించె।పంచ పంచలను నెంచి శోధించియుఁ గొంచెపుఁ దనువుపై కోరి క్రందెంచియు। పంచవింశతిమించినపరిపూర్ణమునుబోధించి గురుఁడు॥ రక్షి॥ వాసిగాచరనాబ్జదాసుకు పరమేశుఁడై కడతేర్చెకొనసకు। కసురాంతకునిభక్తి యిసుమంతనొసఁ గియు। నసురపురమునందు విసరుపవనముఁబట్టి। ధ్యాన మఱువక దేశికులసంతోషమున సేవించుకొనుమనియాశా పాశములఁగోసిచిద్విలాసు నుపదేశమిచ్చి॥ రక్షి॥

## కీర్తన 19.

శుభముగాను శ్రీగురువరుఁడిక నను-శుద్ధిఁ జేసినాడే-మ నసా-అభయమిచ్చియనుభవసిద్ధాంతంబమరఁజూపినాఁడే మనసా॥ శు॥ క్రమముగ రుద్రాక్షాభరణమును కంఠమున వేసివాఁడేమనసా। విమలముగనుభూతిత్రిపుండ్రము ను దుటరాసినాఁడే మనసా॥ శు॥ శిరముపైనఁగరముంచి పిదప పరవస్తుదెల్పినాఁడే మనసా। ముఱియుచుమంత్రముముం దుకర్ణమున ముద్దుగఁబల్కినాఁడే మనసా॥ శు॥ అహంబ్ర హ్మాస్మియను మహావాక్యములయంతుఁ దెల్పినాఁడేమనసా।

సంభ్రమముగ అయ మాత్మబ్రహ్మమును సాక్షి నిలిపినాఁడే మనసా॥ శు॥ మదిమఱువక గురు పదముల నెప్పుడు వదలక గనుమనె నేమనసా। అదినిజగురు పదమ్మహంసోహంబని యోచుచుండమనె నే మనసా॥ శు॥ కాటుకపక్షుల మధ్య నుండు కవాటము దీసెనే మనసా। నూటిగా మఱి త్రికూట స్థానమున బోటినిఁజూపె నేమనసా॥ శు॥ ఆదిమధ్యాంత ములులేని యచలము నెఱిఁగించె నేమనసా। రాదుపోదది పరమరహస్యమని బోధఁజేసె నేమనసా॥ శు॥ శివజీవులకై క్యంబుఁదెల్పిన శ్రీగురునరవరుఁడేమనసా। అవనిలోనదరిఁ జేర్చుటకై యవతరించినాఁడేమనసా॥ శు॥ విరివిగ ద్వాదశ విధ మంత్రార్థం బిదియని బల్కె నెమనసా। త్వరగ షోడశాక్షరియను నెఱుక। దం చెఱిఁగించె నేమనసా॥ శు॥ ప్రజ్ఞానంబ్రహ్మమున తత్వమసియని భ్రమలుడిగించె నే మనసా। సుజ్ఞానివివేచనార బ్బంబని నామం బేర్పరించె నేమనసా॥ శు॥

కీర్తన 20.

తెలియవలెనుజీవ తెల్వోలోఁ దల్వి తెలియవలెనుజీవా। తెలియవలెను మొదలు తెల్వితో డను వేగఁగొలువ వలెను గురుని దలఁచవలెను నిత్యం॥ తెలి॥ మూడాఱంటికి మూతవేసి। ముప్పాటికిమంత్రము ముఱియుచు నీవు పఠనఁ జేసి। కోడెతనముల వీడి జాడ నెఱిఁగి ముందు। ఇడాపింగళల మధ్య నాదుస్వరంబు నీలో॥ తె॥ పండు వెన్నెలఁ దెలియఁబరత

త్వజ్ఞులకే। భావమైయుంపునిలయ। రెండుచక్షులమూసి కుండలిని భేదించిచూచి। దండిగవెళ్లెను నఖండమూర్తిని సీలో॥ తెలి॥ మాయాప్రపంచమువిడిచి। మన్మథోద్రేకమూ యనువేగమేగడచికాయముపై భ్రాంతివిడి। ఆదాయము నుము క్తి నెదకి। పాయకసద్గురుపూజఁ జేయవలెమనసందు॥ వేషభాషలకోసి-వేగమే అచంబ్బోధగురుచేఁదెలిసి।ఆశా పాశములఁగోసి। యీషణత్రయముగోసి। దోషముల్ విడఁజేసినట్టి దేశిక సరవరునిఁగూడి॥ తెలి॥ కుటాకుటము లవిడిచి। శరణనుచుసద్గురుదేశికుల సేవఁజేసిఅరమరవీడి పరిపూర్ణుఁడై వెలసిన। ధరచరణాబ్జదాసవరదునికవికృతి॥

కీర్తన 21.

ఇహసౌఖ్యంపరసౌఖ్యం బదిగంటేసదాసౌఖ్యం॥ఇహ॥ ఇహబాటపరబాట అదిగంటేసదా తేట॥ ఇహ॥ యోగ నిద్రా-భోగానిద్రా అదిగంటే-సదాముద్రా॥ పైవెల్గూ లోవెల్గూ - అదిగంటేసదా వెల్గూ॥ ఇహ॥ సంసారము యమపురము-అదిగంటేసదాసారము। ఇహ॥ నాదబిందు మోదమొందు - అదిగంటేగురునందు॥ ఇహ॥ జాతివర్ణ మంత్రచూర్ణం - అదిగంటేపరిపూర్ణం॥ ఇహ॥ నరవరగురు వరా - అదిగంటేహరివేత్తా॥ ఇహ॥

కీర్తన 22.

భజామిశంకరంశ్రీ పాదపంకజం నిజాంశధృతకరం। నిరామయ తేజందోల్గునుకృతం భవదోషయాగతం। గల్గు

సద్వ్రతంకన కాంబరచరితం॥ భ॥ సద్బోధసుధారసం। సరిసేయునమరసం। చిద్బిందున నిరసంజిల్కించుమానసం॥ సుధాబ్ధినిష్కళం సంతోషసుఖఫలం శోధించ హృద్యే దంబానరించ రేష్టలం॥ భజ॥ జ్యోతిప్రకరణం। ఓంకారవివరణం। పాతకహారణం। ఘనపండితాభరణం॥ భజా॥ సురవంద్యపూజితంవరదాససేవితం। చరణాబ్జచర్చితం చెన్నొందువిచోతం॥ భజా॥

## కీర్తన 23.

శివనామ స్మరణసేయుదవూ। జన్మభవరోగముల కెల్ల బరువైనఔషధము అవనిలోసాధించుముదము। జీవచవిగానుమధురామృత మావిధము॥ శివ॥ పంచాక్షరీపఠనఁ జేసి। పంచపంచకముల నెల్లఁబరికించి లేచి। సంచితభవములరోసి। జీవాళించగుణములకుఁ గోదండమేసి॥ శివ॥ ఓంకారమునమనసుఁ బెట్టి। కాలకింకరదూతలశంకవిడఁగొట్టి। చింకమైనజ్యోతిముట్టి। ప్రణవఝుంకార నాదముల్ పెంపొందఁదట్టి॥ శివ॥ ఏకచిత్తులమైనిలిచి। హంసరాకపోకడసంధిపాకమెతఱిచి మకారమంతయుఁగడచి। జీవా-ఏకాక్షరబ్రహ్మమునునిత్యముఁగొలిచి॥ శివ॥ జ్ఞానమనే తెల్విచేతఁ కర్తఅజ్ఞానముల నెల్ల వదలించుదాత। సుజ్ఞానపదవికిభీతా। జీవ-జ్ఞానాజ్ఞానములఁ బూనిమనచేత॥ శివ॥ పరిపూర్ణభావంబు నెఱిఁగి। తిరిగిరానిపద్ధతినీలోస్థిరముగాఁ జెఱిగి నరవరచరణమేమఱిగి। ధరనుచరణాబ్జములశంభునిసేవకెఱిగి॥

## కీర్తన 24.

శమనుచేఁజిక్కకముందు సాధించుమోక్షముమనసా।
నమోనమోయనుచుహరునినామమెభజియించుమనసా॥
భూతిరుద్రాక్షలుదాల్చి। గీతనృత్యములను సల్పిఁప్రీతిచే
సద్భక్తులఁగాంచి। దాతనుసేవించుమనసా॥ శమ॥ అను
భవగురునిఁజేరి ఆనందసుఖఫలముగోరి తనవునుశోధించి
తత్వసారమే గనుగొనవెమనసా॥ శమ॥ పంచాక్షరీఫల
ముఁదెలిసి కించగుణములఁ ద్రుంచివేసి। సంచితభవము
ల విసర్జించెడు సూహగనుమనసా॥ శమ॥ ఆఱుచక్రముల
నుమీఱి। మేరుశిఖరముననునిలిచి। ఘోరనరకములను
గూల్చుధీరునిఁజేపట్టుమనసా॥శమ॥ అష్టమదములపై రణఁ
చిద్రృష్టినిష్ఠయందునిలిచి। దృష్టిమఱువకపరిపూర్ణశ్రేష్ఠ
లైఁగనుగొనవెమనసా॥ శమ॥ పెద్దలసేవించుముందు సి
ద్ధుఁడవయ్యెదవునిజము। రద్దిపాలులుగాక పరశివ పద్ధతిచే
కొనవెమనసా॥ శమ॥ వాసిగాచరణాబ్జనుత గౌరీశుని ప్ర
సన్నముగను। జూచిమానాభిమానములను। గోసిదోసి
లొగ్గుమనసా॥ శమ॥

## కీర్తన 25.

జీవాసీకిపుడునే బోధింతువినవే। భావించిపరమసద్బో
ధచేకొనవే॥ జీ॥ ముటికిదేహము దీనిమురిపెమేలనురా।
కరిమ్రింగినవెలగపండు చందమురా॥ జీ॥ తల్లిదండ్రియు

భార్యతనయులు మేలా। కల్లలాడుచుం గుల్కంగారణ మేలా ధనధాన్యములం గాంచం దనయునీ కేలా। జననమరణముల జాడగనుబాలా॥ జీ॥ ఆఱుగుణములంబట్టి దూరనాడుము రా। భారమునీదని కోరి వేండుమురా॥ జీ॥ అష్టమదముల యాస్త్రమానుమురా। కష్టమనక ప్రభుచేష్ట గనుంగొన రా॥ జీ॥ మందబుద్ధుల నీవుగుంది వేయుమురా। బొందిలో దేవునిసందు గనుంగొనరా॥ జీ॥ సాంఖ్యతారకముల సాధించ వలెరా। ఓంకార మేప్రణవమనుచు వినవలెరా॥ జీ॥ పంచ ముద్రలంబట్టి యెంచి చూడుమురా। సంచితభవములం ద్రుంచి వేయుమురా॥ జీ॥ నిన్ను నీవెఱ్ఱంగెదు నిజమేదోగ నరా। తన్నుందాం దెలిసెసుతత్త్వమేవినరా॥ జీ॥ ఆశాపాశ ములనుగోసి వేయుమురా। శేషభూషణుసేవం జేయుచుం డుమురా॥ జీ॥ సదాశివునిం బూజించు సద్భక్తులను। ము దమొంద సేవించుస్థిరభక్తిగాను। జీ॥ పరిపూర్ణమనుబట్టి బయలయి తేగనరా। త్వరగా షోడశాంతురిగు ఱ్తదసరా॥ ధరణిశ్రీ చరణాబ్జదాసునీ ఘనా। హరునిభజించుం డీఆనం దముగాను॥ జీవా॥

## కీర్తన 26.

ఏల యీజన్మమిం కం జాలుచాలని గురునిపాలం బడి యుండవేమనసా। కాలమెల్లనున్న ధాగడవుటేసరిపో యెం గలలో మేల్కొన్న వెఱ్ఱిమనసా॥ ఏల॥ సకలశ్రీ సంపదలు

సఖిలంబుగలదని। సుఖ మదని నమ్మకేమనసా-ఒకటి యు
నీ వెంటరాదది నిశ్చయమేకదాఁ - అకలంకు నెఱుగుఁడీ
మనసా॥ ఏల॥ ఎప్పుడో యేవేళ తప్పదీజీవునకు ముప్పు
గల్గియున్న దేమనసా। చప్పరించును మాయశక్తులు దం
డించి తప్పించదికేడిమనసా॥ ఏల॥ నాటికిప్పుడే నీవు
సూటిగా శ్రీహరునిచాటుచేరుండవేమనసా కోటిపాపంబు
లను కొనగోటఁజిమ్మివిరాటునెఱుఁగవే మూఢమనసా॥ఏ॥
జననమరణంబులను గనుఁగొనిరెంటిగుణియించి చూడ
వేమనసా।దినమెమరణంబని దిగ్బంధ తెల్పొంది తనువు
శోధించవేమనసా॥ ఏల॥ మూట మూటనిదాఁటి తేఁట
బ్రహ్మానంద పేటబాటగనుమనసా। కోటి సూర్యకాంతి
వాటివెల్గొందు సూటితప్పక చూడుమనసా॥ఏల॥ చతు
శ్శ్రుశూషలను హితవుగా సద్గురుని కతము గావించవె
మనసా॥ మతినిల్పి సద్గురుని మఱువకను అనుదిన
ముస్తుతియింపుచుండవే చరాచరంబంత నిరంతరంబుగా
భజియించియున్నాఁడే మనసా॥ సరాసనదినీవు బిరానఁ
గనుఁగొంటె దరిచేరెదవు ధన్యమనసా॥ ఏల॥ వాసిగా
చరనాబ్జ దాసుఁడిలదెల్పంగ ధ్యాస మఱచియుండకే
మనసా। ఆశాపాశములఁగోసి యోగ్యులసేవించి దోసి
లొగ్గియుండవే మనసా॥ ఏలయూ॥

తల్లడిల్లినఁజెల్లనిది॥ ఉ॥ నమ్మరా
నంబున దీనికా తొమ్మిదిద్వారముల బొమ్మ[illegible]కొని
యున్నదికా॥ ఉ॥ చచ్చువారిని జూచితమలో మచ్చ
టల్ పరికించరు హెచ్చులేలనుస్వచ్ఛముగఁ బ్రత్యక్షుని
శోధించరు॥ ఉ॥ న్యాయముగ సుఖదాయ మెఱుఁగు ను
పాయమే యూహించరు। ప్రాయ మెల్లను బోవు సహా
కాయమును శోధించరు॥ ఉ॥ వాసిగను చరనాబ్జదాస
ప్రసు తేశునిమృదువాక్యము క్లేశపడకయు ధ్యానబయ
లునఁ జేసియుంచిన సౌఖ్యము॥ ఉ॥

## కీర్తన 29.

ఎఱుకఁదెలియరె దెల్పెద-సద్గురుమూర్తి-ఎఱుకవా
రింగోని ల్పెద। ఎఱుకమఱుపుల రెంటినిఁ బరికించిబయ లే బ్ర
హ్మమనుచు। నెఱుకతో నరుదెంచికలలో నెఱుకతోఁజను
నారమనుచు॥ ఎ॥ పంచవింశతితత్వము। దెలసియుఁబూర్వ
సంచితానుభవము। పంచపంచక మెంచిపరిశోధించి యూ
త్మను ద్రెంచియూవల నెంచి సద్గురుపాదజలమును। పంచా
మృతమేయుంచుఁదెలిసి॥ ఎ॥ రెండుచక్షులసందున। దృ
క్కునునుంచి నిండిప్రాణనముసందున। అండపిండాజాండ
ములరెండు ఖండములుగ భాగించియూర్ధ్వ।కుండలిని భేదిం
చి యూవల సహస్రార మండలమందునిలిచి॥ ఎ॥ ఆగామి
బోధయు నెఱిఁగియు। బాగుగ రాగద్వేష భావముల్నెరగి

యస్మాత్ యోగభోగ్యములందు సంయోగమానముఁదాల్చి తత్పద ... వినోద సద్గతి వేగమే సాధించుచు॥ ఎ॥ అంతరంగమునందున - బహిరంగము - ఇంతవింత నియందును నా। ఇంతటంతట నెంతో వింతగఁ జెంతగాకను నంతరాళం బంతనిండితానతానై వింతగను వెల్గొందుగురుని॥ ఎ॥ వేషభాషలు రోసియు। సచ్చరితము భాసురంబుగఁ జూచియు। ఆశాపాశముల్ గోసి చిద్విలాసమున దేశికుని పదముల। ధ్యాసఁబూని నుతించు శ్రీ చరణాబ్జదాసకవి ప్రకాశుని॥ ఎఱుక॥

కీర్తన 30.

గురుమంత్రార్థము గుఱుతు నెఱుంగక గుణవంతుఁడననినా యెనా - అర్థము దెలియని యర్థముల కెల్లనుహారి దర్శనమే యాయెనా॥ గురు॥ తటపుటమంత్రాలెన్ని నేర్చినఁ దారకమంత్రంబే యగునా। మతములో దేవుని మర్మము దెలియక మఱి సుజ్ఞానుండే యగునా॥ గురు॥ పంచేంద్రియముల పరువుల నణఁచక। పరమయోగినంటే యాయెనా। చంచలముగని చపలచిత్తుఁడు శ్రేష్ఠుఁడనంటే యాయెనా॥ గురు॥ గాయత్రీజపమాలిక త్రిప్పిన కారణపురుషుండే యాయెనా। మాయక మనమున భగవత్ స్మరణ పన్నిన భక్తుండే యాయెనా॥ గురు॥ ఘనముగ ధనమును గలదని విక్కిన గతిమోక్షమునకుఁ బోవునా। జ్ఞాన మొదలవి రెం

డింటిని దెలియని క్రోతియుసింహంబగునా॥ గురు॥ ఇలలో శాస్త్రములెన్ని చదివిన నిజకవిపురుషుండగునా । కుల గోత్రంబులవర్జితపఱచక గురువులమనిన నగునా॥ గురు॥ ఆశలనుడుగక దాసుఁడననిన నారోగ్యపరుఁ డగునా। వేష ముదాల్చక దేశముదిరిగినఁ జేసినపాపముపోవునా॥ గురు॥ అరమరలేకసుధారసకరి పరిపూర్ణదాసుండగునా । స్థిర ముగనరవరచరణముమఱిగిన। వరచరణాబ్జండగునా॥ గు॥

## కీర్తన 31.

జూటామాటలాడఁ బోకండి-యచలంబుఁ దెలియక। మేటిశిఖరము నెక్కఁబోకండి । కూటికొఱకై పుడమిలోప ల - వాటముగ వేషములుదాల్చక-మాటలధికము నేర్చి గొప్ప- తేఁటపరులమనుచునిక్కి॥ జూ॥ భక్తులమనిపొగడు కొనిచెదరు-ఛీఛీజీవ-ముక్తిదెలియకవ్యక్తులయ్యెదరు। యుక్తిచేపరబ్రహ్మ మూర్తిని - శక్తితోగుఱుతెఱుఁగ లేక ను - భక్తునికై వడిబ్రహ్మాండము - భుక్తపఱచకవిరక్తినొం దుచు॥ జూ॥ కాకవులఁగూర్చిపాటవ్రాసెదరు - కాకులతీ రుగ-లోకమందునఁగేకవేసెదరు । ఏకబ్రహ్మంబెఱిఁగితన లో-రాకపోకలణఁచలేకను - భీకరంబుగ మేమెపెద్దలని - టీకులాకునఁదిరిగ చెడెదరు॥జూ॥ దొంగగురువులనమ్మిచెడి యెదరు-నాటికిమీరలు-భంగమైనరకమునఁ బడియెదరు। చంగుచంగునఁగాలకింకరు లంగుగను ప్రాణంబుడీయఁగ।

వంగిదండము పెట్టితిరిగి - వెంగళులై జన్మింతురిలలో॥ జూ॥
నేను నేననియెంచఁబోకండి - నేననుశబ్దము - లేనే లేదది వె
దకిచూడఁడి। రానిపోనిది యేదో దానినిఁ - బూనుకొని
ధ్యానించనేరక - కానన్నమునను జిక్కి మానాభి - మాన
ములువిడనాడఁజాలక॥ జూ॥ యోగులమనియెగసిపోయె
దరు - యోగాంతరంగము - భోగమెఱుఁగక రోగులయ్యె
దరు। బాగుగానాసాగ్రమందున - వేగమే వెల్గొందుస్వాము
మును - మ్రోగుచున్న సంధి నెఱుఁగక - రాగద్వేషవిభోగ
మొందుచు॥ జూ॥ గురువులమనిపల్కఁగోణఁగెదరు - అర
ణ్యకాండము - నటికి వేయక యందుమునిఁగెదరు। బూరు
గుఫలములకుఁ జిక్కులు - ధీరతఁబొంచినవిధమునఁ - జే
రమీరలు నమ్మియుండిన - క్రూరులై నరకమునఁబడెదరు॥
వాదభేదములాడఁబోకండి నిజగురుని - పాదపద్మముల ని
జనమ్మి బ్రతుకండి - బుధజనవిధేయుఁడగు శ్రీ - సాధువర
చరణాబ్జవాక్యము - వేదార్థములెల్లఁదెలిసి బోధఁజేయు
నిజపదంబిది॥ జూ॥

కీర్తన 32.

కాళీమహేశ్వరి రావే - మహాంపాహి॥ కాళీ॥ చాలఁగాని
పాదపద్మముల సేభజించుచును మేలుగానేనాత్మలోనెకీ
లింగంటిగురునిచే॥ కాళీ॥ అట్టి [illegible] త్తిరూపుదాల్చిపట్టి మహి
షాసురునిఁద్రుంచి నట్టి రాణివనుచు మొఱఁ బెట్టితిఁ జేకొన

వమ్మ॥ కాళి॥ అంబ అఖిలదేవీ ఓం థంభిని దిగ్బంధయాని కుంభినుద్భవించినట్టి శంభుని శర్వాణివిన్నుతా॥ కాళి॥ చిదాద్రిపిరజితాద్రినిలయ రుద్రి కళ్యాణిరావే। ముద్రలో నే నిన్నుఁజూచి నిద్రమేల్కొన్న జననీ॥ కాళి॥ తన్నుఁదాను దెలిసినట్టిధన్యులను వెక్కిరించు దున్నలనుబట్టి ప్రసన్న ముగఁద్రుంచుటకు॥ కాళి॥ దాసులనుజూచి గేలిఁజేసెడు దుర్మతులఁబట్టి కోసిశునకములకు వేయ। శేషభూషణు నికొమ్మా॥ కాళి॥ జాలమేలఁనన్నుఁ బ్రోవఁ గాలభాగమందు లీలం। వాలలాడుచున్న సుశీలదేవి దుర్గాంబ॥ కాళి॥ సు ట్టుగురునిచేతఁగన్న పట్టువదలక యేయున్న ముట్టచూచు కొన్న దేహానువట్టిదని వదలియున్న॥ కాళి॥ నిన్నే నెఱనమ్మి యున్న చిన్ని చరణాబ్జుఁడన్న వన్నె మీఁటి నెల్లుచున్న పు న్నమ వెన్నెలఁగన్న॥ కాళి॥

## కీర్తన 33.

పరమశివునిపదపద్మము లెప్పుడుభక్తిగ్రమొక్కుటయె న్నటికో। స్థిరబుద్ధిచేఁదారకము హంసకుఁ బెంపొందఁగఁజి క్కుటయెన్నటికో॥ పర॥ మందబుద్ధులనుగుంది వేసి యూ మమతలు విడుచుటయెన్నటికో।ముంచుగమానవ కోటికి మొదలదిముఖ్యము తెలియుటయెన్నటికో॥ పర॥ గుటిచే తనుచుగ్గురినిడఁగొట్టియు గుటుంతుగనిలుచుటయెన్నటికో। క్షరమక్షరముల సంధినెఱిఁగి సుస్థిరమతినగుటయెన్నటికో॥

ఈషణత్రయముల వేషభాషలను రోసివేయుటయెన్నటి
కో। దాసదాసులకుదోసిలొగ్గి తద్దాసుఁడనగుటయెన్నటి
కో॥ పర॥ మదిమఱువపంచాక్షరీ మంత్రముమనసులోఁద
లఁచుటయెన్నటికో। సదాశివునిసద్భక్తులఁగూడుక సమ
సరమగుటయెన్నటికో॥ పర॥ వెలుపలలోపల వెలుగుల
వెలుగై వెలుగుచు నుండుటయెన్నటికో। ఫలమదిపూర్ణ
భావంబెఱిఁగిప్రజ్ఞానుఁడనగుట యెన్నటికో॥ పర॥ నాది
నీదియను వాదభేదముల బాధలువదలుట యెన్నటికో।
ఆదిమధ్యతుదలులేక సర్వమును అచలుఁడనగుట యెన్న
టికో॥ పర॥ బిందునాదకళాచి ద్బిందుఁబొంది యనంతముఁ
జెందుటయెన్నటికో। అందముగను జరణాబ్జదాసపద్బ్రం
దుఁడనగుట యెన్నటికో॥ పర॥

## కీర్తన 34.

ఆత్మఁదెలిసి పూజసేయవే। మానస। జ్యోతినాత్మని
శోధించినిలుపవే। ఆత్మఁదెలిసియనుభవంబెఱిఁగిన సాక్షి
కునిచరణంబెమదిగని ఆత్మానాత్మవివేక పరిశుద్ధాత్మలోన
నాత్మస్థివై॥ఆ॥ వేదశ్రుతులను వెతకిముందుగా। మానస। నిజ
గురుబోధలోనే మోదమొందఁగా। నాదినీదనునటనవా
క్యముకాదుకూడదు కపటచిత్తముక్రోధభేదము లెల్లగడ
చియు నాదనాట్య వినోదమొందియు॥ ఆ॥ జ్ఞానులకుశరణ
నుచుఁబల్కవే। మఱిజన్మచాలని। ధ్యానివై సుఖయించిగు

ల్క వే। నేనునీవనినీవు నేనని బూనుకొనిభూ్రిమధ్యనా త్మc
దెలిసి॥ ఆ॥ కుండలిని భేధించిచూడవే। భ్రమలు బచిమూ
లాధారముంధుకుమును వెల్గించి వేడవే। నిందుకొని బ్రహ్మాండ భాండ
ముదంశిగను వెల్గొందు ప్రణవ మండలంబును దాటియా
వలcబండు వెన్నెల పాలcజూచి॥ ఆ త్త॥ గురుc డేహరుcడని
భజన సేయవే। గుఱినిల్పి పరములో-గుఱ్తుగా నివసించినిలు
వవే। ధరణునరపర దేశికార్యుల। చరణముల సంస్మరణc జే
సెనువర శ్రీచరణాబ్జ సద్గురు కరుణలోcబడినిలచి నిత్యము॥

## కీర్తన 35.

ఇదిపరమరహస్య మోయన్న। దీనిcబదింపఱచి తెనొ
ప్పపరమపదమన్న॥ ఇది॥ వేష భాషలుగానిదన్నా। దోష
శోషణపోషణంబులు లేనిదన్నా॥ ఇది॥ చిక్కి-చిక్క-కయు
న్నదన్న। ఎక్క-డెక్క-డc జూచినన్ొక్క-టేయన్నా॥ఇ॥
అంది పొందకయున్నదన్నా। తత్త్వమందినవారికానందమ
న్నా॥ ఇది॥ ఇంతవింతనరానిదన్నా। చింతc జేసిశోధించి
తేటంతు లేదన్నా॥ఇది॥ స్నానసంధ్యలుగానిదన్నా। ఇంత
మానాభిమానముల్ మఱిలేనిదన్నా॥ఇది॥ జపతపమ్ముగా
నిదోయన్నా। దీనియుపము దెలిపిన గురునినూ కేగింతుర
న్నా॥ ఇది॥ చూపుచూపులుగానిదన్నా। రేవుమాపనక వె
ల్గొందుదీపమిదన్నా॥ ఇది॥ స్థూలసూక్ష్మముగానిదన్నా।

దీనికీలు దెలసినవారు మేల్కొందురన్నా॥ ఇది॥ నరవరా చార్యుఁడోయన్నా । చరణాబ్జదాసుకునూఁతి దారఁబో సెనన్నా॥ ఇది॥

## కీర్తన 36

కులముబిడువవలెరా। యిలలోఫలముదెలియవలెరా। ఫాలమునను బ్రహ్మనుదర్శించియు మేలుగనాత్మలోఁగీలు దెలుసుకొని॥కు॥ పందినిదినవలెరాకుక్కకు బంధమేయవలెరా। సంమఁజేసి గజేంద్రునిఁద్రుంచియు। ముందుగవెళ్లునానందముఁ గనుగొని॥ కుల॥ నాదమువినవలెరా। కుటిలభేదముడుగవలెరా। భేదముడిగిసద్బోధలో నిలిచియు సాధుసంగతి సమరసమునఁగని॥ కుల॥ ఆత్మఁదెలియవలెరా। దెలిసి సర్వాత్మనీవెయనరా। ఆత్మానాత్మసదాత్మజ్ఞుఁడవై సాక్షీకులచరణాల వినిగనుఁగొని॥ కుల॥ మఱుగుదెలియవలెరా।సద్గురు మర్మమెఱుఁగవలెరా।విఱుగదుతఱుగదు పెఱుగదుకఱుగదు । మొఱుగదనుచు మదికిరవుగదెలుసుక॥ కుల॥ ఎఱుకఁదెలియవలెరా।దెలిసియామెఱుకమఱువవలెరా। యెఱుకమఱచిన నరకము లేదిఁక । నిరతమునీలోఁజరితలు దెలుసుక॥ కల॥ ఆశలుడగవలెరా।అబ్దముల్ వెదకిచూడవలెరా। వాసిగనరవరదేశికకృపచేదాసుఁడైన చరణాబ్జచరితవిని॥ కుల॥

## కీర్తన 37.

దారి-భక్తాదులునడచుదారి॥ దా॥ గురుమంత్రార్థముగూలుతు దెలుసుకొని-నిరుపమానమున-నిలిచినడచునోక॥ దారి॥ సాంఖ్యతారకము సమరసమునఁగని - హాంకారంబుల - నణఁచినడుచునోక॥ దారి॥ పంచభూతములఁ ద్రుంచిప్రపంచము-మించి యాత్మశో-ధించి నడుచునోక॥ ఆఱుచక్రముల మీాఱి కోరి సహస్రారపురమునకుఁ జేరి నడుచునోక॥ దారి॥ మాయనుగడచును పాయముగనుఁగొని-న్యాయముగను సుఖదాయమెలుఁగునోక॥ దారి॥ పరిపూర్ణంబనుపద్ధతి నెఱిఁగియు-స్థిరముగనరవరచరణము మఱిగిన॥ దారి॥ భాసురముగ చరణాబ్జదాసునకు-వాసిగనార్యులుచూపి దెలిపిన॥ దారి॥

## కీర్తన 38.

తెల్ల తెల్లనివాఁడె బ్రహ్మముకల్ల గాదదివినరయా। యుల్లమందునసమ్మిసద్గురువలన మీాదిగనరయా॥ తెల్ల॥ కంటిలోపలనంటియుండెడు రెంటిసఁదునఁగనరయా। మంటమండెనుధగధగయని ఘంటనాదము వినరయా॥ తెల్ల॥ అండపిండమునిండిపై బ్రహ్మాండమూయెను వినరయా। ధంఢిగనుభూమండలంబున ఖండాఖండమునిఁ గనిరయా॥ తెల్ల॥ పంచవర్ణలుమిాఱియుండెడు నెంచసౌఖ్యముగాదయా। పొంచిభక్తుల పంచఁజేరినఁ గొంచెములోఁగనుపించున

యా॥ తెల్ల॥ వేదములు చదువుచు గొప్పవాదులాడెదరే మాయా। వేదవేత్తలంజేరిబోధ పాదుదెలసినసాధయా॥ తె॥ చచ్చి పావని దేదోధాని నిచ్చుతోంగనుం గొనరయా। చు ల్కగనుబరమార్థ మెఱింగినదళ్కు బెళ్కులవాండయా॥ వాసిగను చరణాబ్జకవికృతి భాసురంబుగ వినరయా। దో షముల్ దొలంగించు నరవరదేశికోత్తముం గనరయా॥ తె॥

## కీర్తన 39.

రాజయోగమునందు షద్గతిరహస్యమార్గమె వింటిని। తేజముగ వెల్గెడుజ్యోతినిం జక్షులమధ్యనుగంటిని॥ రాజ॥ అంగత్రివిధములందుషడ్భవ లింగమూర్తిణినింజూచితి।గం గయమునలమధ్య సర్వ సంగతులెల్లం దెలిసితి॥ రాజ॥ వె తకిననుగనుపడనివస్తువు వెతకికన్నులంజూచితి। ఖ్యాతినిసా ధులపాదధూళై మతమలెల్లను గడచితి॥ రాజ॥ పంచవిం శతితత్వముల శోధించి యాత్మనుగాంచితి। మించికేవల పూర్ణభావమి దంచు సైగలోనుంచితి॥ రాజ॥ ధరణుశ్రీక వ్వాడిగుడపుర వరుడుండవని నెఱనమ్మితి। స్థిరముగనునీజా డందెలసినే చిజ్జడములను జిమ్మితి॥ రాజ॥ ధ్యానమఱువక దేశికులనంతోషమున సేవించితి। భాసురముచరణాబ్జవర కవి దానుండన్నా వికసించితి॥ రాజయోగ॥

## కీర్తన 40.

హాశివానిను మఱచినందున కాశహెచ్చెను దేశికేం
ద్రునిమాట మీఱితినేఁజూచి నందుకుఁగీడుగా॥ హాశివా॥
కానివారినిఁగూడితిఁకనేఁగాని మాటలునేర్చితి। పూనిబు
ధవరుఁబూజఁజేసి నే బుద్ధి కుశలతఁగూర్చితి॥ హాశివా॥
వద్దనున్న సద్గునెఱుఁగక బుద్ధిలేకనుదిరిగితి । బద్ధులచే
మాటవకుటకు కద్దటనినేనెఱిఁగ్రితి॥ హాశివా॥ మాటదీఱె
నునిర్ణయము నా మనసు నిండెసంపూర్ణము। కోటిమాట
లమేటిసూటది మూటనే పరిపూర్ణము॥ హాశివా॥ మఱు
వసీసద్భక్తియిఁకనను మఱువకనుకృపనేలుమీ। తెఱుగు
లేనినామమంత్రం బిరవుగా నిఁకఁ జాలుమీ॥ హాశివా॥
బందరపురమందిరా ఆనందబృందచంద్రమా। యిందిరా
శ్రీరాజపేటడెంద నాదిఁదిందివా॥ హాశివా॥ దాసుఁడను
దరిఁజేర్చపాదశ కోటిమంగళాధారా। ఈశ శ్రీచరణాబ్జదా
సదోషరహితభూధరా॥ హాశివా॥

## కీర్తన 41.

జీవానావమాటిఁకవినవే। అనుభవసారామృతము గొ
నవే। దేహిదేహభావములను గనవే। గుణసాహసమునని
డివినవే॥ ఓజీవ॥ మూటిమూటిని విడనాడిరవికోటి ప్రకా
శునిఁగూడి। బల్ దాటవలెను మాయనోడిరతికూట మో
హాలనువీడి॥ ఓజీవ॥ దుష్టతనమువిడనాడి భువి నిష్ఠాగరిష్ఠ

గూడి। జీవఅష్టగజములకుఁ బేడివైచి। కష్టమతములను వీడి॥ ఓ జీవ॥ స్నానసంధ్యలు జేయనేలము క్తిగాన కుండి ననది మేలాఁజీవ। బూనిచి న్నయుఁజేర వేలాక నుము వా మసంగను బాలా॥ ఓజీవ॥ తరాతరములవాఁడే సచ్చరాచ రముపిండినాఁడే। పురహారపూజితసుందరుఁడే పరిపూర్ణ వరదస్థిరపరుఁడే॥ ఓజీవ॥ నిరాకారని ర్గయుఁడే నిజజగాళి సమ్మతపరుఁడే। జీవ - హా కు గరళకంధరుఁడే వరజాబ్జహృ దయహృత్సరుఁడే॥ ఓజీవా॥

## కీర్తన 42.

రాజయోగియనరా శివరాజయోగమునందు రంజిల్లి పుణ్యుఁడా। రా॥ అజహరిరుద్రుల కనుభవమయిన నిజ జోడ దెలసినవిత్యుఁడా॥ రా॥ సుజనుల సేవల్ సూటిగా నేచేసి కుజనసంగతిగూలఁజిమ్మితిరా శివ॥ రాజ॥ అట్టియయి దిఁటిఁబట్టి గట్టిగాకుణిఁ బెట్టి దిట్టముగాఁదలలు గొట్టితిరా। చట్టిలో నేదైవసారము దెలుసుకనట్టిదాని దేహామందు నిరా శివ॥ రాజ॥ మూఁ - ాగుణములజాడపీడి పదమూ మదుర్గుణములఁ బాసితిరా। ఇడా పింగళ మధ్య నాడు స్వ యమున్లో నేను హంసతోఁ బాందులాడితిరా। శివరాజ యోగిని॥ రాజ॥ అక్షయముగ రెండుచక్షులమధ్య నేదీక్ష తోఁజిద్రూపుఁజూచితిరా। అక్షరాక్షరముల స్వచ్ఛము గనుగొని।నిశ్చయించికృతి సలిపినారా శివ॥ రాజయోగి॥

గిసీ॥ రా॥ మూడాఱువాకిళ్లు కూడబంధించియు నేడు కొండలపైకి నెగసితిరా। వేడుకతోఁదఱగూడి సుఖంచెడు వాడమేడలోన నిలిచితిరా॥ శివరాజయోగిసీ॥ ధరణిశ్రీ చరణాబ్జ దాస పరంపర వాసునై కైవల్య మందితిరా। విఱుగుతఱుగులు లేనివిధమునే గుత్తైకొని। యింటిమార్గ ముత్రోవఁగంటినిరా॥ శివరాజయోగిసీ॥

## కీర్తన 43.

పట్టివిడువరాదు। పరమేశుపదములు॥ ప॥ బట్టబయల సుభావము దెలియక వట్టిదనుచు నొనరంగవిడచిన।పుట్టుట గిట్టుటనిజమని వేదము గట్టిగానుమొఱఁబెట్టుచు నుండగ॥ హస్తమస్తసంయోగముఁజేసి విస్తరిల్లసుజ్ఞానముఁబోసి।సుస్తివిస్తరిగగురుచరణము కుస్తిసేయుసమస్తమునీవని॥ప॥ అగమసంచితాదులనణఁచి నిగమగోచరార్ధము నిజ పఱచి। ధగధగయనిమెఱసెడు భగవంతునినగుపడఁ జూపిన రఘుపచరణము॥ ప॥ దండధరునిభయమెల్లను బాపి కుండలినిభేదించియుఁ జూచి।అండపిండముల యర్థము దెలిపిన దండి పరమ ప్రచండమూర్తిని॥ ప॥ జననమరణనుమస్తి యుజ్ఞాగ్రకతనభక్తులకు జనార్దననిగ్రత అనవినరానిది కనుగొన లేనిది। తనమునఁదెల్పిన ఘనగురుచరణము॥ప॥ కరుణాకరుఁడు సద్గోచరగురుఁడు మురహారసురేశుపరాపర పరిపూర్ణుఁడు। అరమర లేకను ధరచరణాబ్జుని స్థిరముగ నేలిన పరగురుచరణము॥ పట్టివిడువరాదు॥

## కీర్తన 44.

జ్ఞానులైనను భావమానజ్ఞానులకుఁ దెలియదురా।
పూనిచిన్న చీమకడుపున భోగియైజన్మించెరా॥ జ్ఞాను॥
ఒంటి స్తంభపు మేడమీందర దంటపక్షులు నుండెరా।
రెంటిసందున మంటమండెను దంటయేమో దెల్పరా॥
చిన్న దాని పెండ్లిరోజున చీరెగట్టనిదేమిరా। పన్నుగను
మహానీయులకునది బట్టబయలై యుండురా॥ జ్ఞా॥ కుక్క
వ్యాఘ్రము రేచుసింహము గూడి యాలోచించెరా।
నక్కయేనుఁగు నెక్కమేషము నమలిమీసము దువ్వె
రా॥ జ్ఞా॥ ముసలిముండాకొడుకు ప్రభువై మూఁడులోక
ములేలెరా। కసురుకొని ముప్పదియాఱ్గురు కరణములు
కొలువైరిరా॥ జ్ఞా॥ తొమ్మిదిద్వారములకొంపను దొంగ
లైదుగురున్నరురా। క్రమ్ముకొనుచునిద్దఱేట గస్తితిరు
గుచున్నరురా॥ జ్ఞా॥ మూటవిడిచియు మూటగడిచియు
మూటిపైననుజూడరా। మూటిమీఁతియు తీతమై ముమ్మూ
లనిండె నదేమిరా॥ జ్ఞా॥ ఆఘయమంజాలు లేనిబాలుఁడు
అధికవిద్యలునేర్చెరా। ప్రవిమల లంజ గుణాత్ములకే కి
భావములున్నదెలియరా॥ జ్ఞా॥ మూలకొదిగిన మూషికము
నొకమూఁడుపిల్లులఁ మ్రింగెరా। వాలుననికుం జేలునలుగురు
జములనువధియించెరా॥ జ్ఞా॥ ముండమోపికిపుట్టుపుత్రుం
డులుండెకారణమేమిరా। తండిగనుకల్యాణములనుమాదడి
గాచుమందురా॥ జ్ఞా॥ వట్టిత్రాసును విట్టచివరమునట్టనడి
మిదేమిరా। ముట్టపలి శ్రీనారసింహులమ్మంగళగృహామా
నురా॥ జ్ఞా॥ వాసిగానిర్కృతులు సర్వవరదాస్యుఁజేలర్చించిం
చెరా। దేశికునిచేబోల్చఁదెలిసియు దీనియర్థంబెలుఁగరా॥

## కీర్తన 45.

ఆనందం మనసానందం గురుఁడానందం బ్రహ్మానందం।
ఆనందరబని యార్యులవచనముఁ బూనియుఁజిన్మయధ్యా
నుల కెల్లను బరమసుఖంబై పండువెన్నెలైయనుదినమును
నరిషడ్వర్గములను ఘనముఁగనణంచిన గుణవంతులకది॥ఆ॥
పాంచభౌతికమునెంచి ప్రపంచమునుమించి గుణంబులఁద్రుం
చికోపములణంచి యంచితముగ గురుపంచఁజేరియాశ్రించి
యాత్మశోధించినవారికి॥ ఆ॥ ఖేచరిభూచరిఁ జూచియు
సమరస రేచక కుంభకమొందినవారికి గోచరఫలమును
వాచా మెఱిఁగియు నీచగుణంబుల విడిచియు నిష్కళ
నిజస్వరూపముఁ జూచినవారికి॥ ఆ॥ నిండుసమాధిలో
నిష్ఠనెఱింగియు దండిగఁద్రివిధము ఖండనఁజేసియు మం
డలత్రయమును జెండియు నూర్ధ్వకుండలిరవమున మండు
జ్యోతిని నుండఁజూచిన పండితోత్తముల కానందం॥ ఆ॥
సాధుహృదయులై సమరసంబునను ఆదిమూలమును
అంతుదెలుసుకొని వాదభేదమను ఖేదమణఁచి నిజబోధఁ
బొందిన వేదవేద్యుల॥ కా॥ ఇక్కడక్కడ నెక్కడఁజూ
చిన నొక్కఁడెశివుఁడని మక్కువగను గురుప్రక్కను జేరు
కఁ జక్కనిపదముల ద్రొక్కియు గ్రక్కున మిక్కిలి
భక్తిచేదృక్కునిల్పితమ్ముఁ మఱచి నిక్కమెక్కడక్క సహ
స్రారమునఁ జిక్కనివారల॥ కా॥ వాసిగ శ్రీ గురుదేశిక
చరణము ధ్యానముకు నభ్యాసించిన చరణాబ్జ దాసకృ
తి భాసురముగ దుర్దోష రహితులై వేష భాషలను
క్లేశపాశములదోసివేసిన దాసదాసుల॥ కానందం॥

## కీర్తన 46.

శ్రీహరినీచరణసేవఁ జేయనారంభించితి-సాహసము చేఁద్రికూటస్థానమున మిముఁగాంచితి॥ శ్రీ॥ హాహాహాచిత్రవిచిత్రమనుచుఁ గన్నులఁజూచితి। మోహారణ్యమును గరుడవాహనదెగఁగోసితి॥ శ్రీ॥ అందమాపరిపూర్ణకళలు అమితముగశోధించితి। బంధకర్తరహితమానీ భజనకానందించితి॥ శ్రీ॥ పంచవింశతి తత్వములభేదించి మిముసేవించితి। చంచలమొందకమనసు చెదరకను భావించితి॥ భక్తులఁబ్రోచెడుబిరుదు బాగఁగలదనివింటిని। ముక్తిమార్గమునకుగొప్ప మూలమె గనుఁగొంటిని॥ శ్రీ॥ వాసిగను శ్రీమట్టపలి ని వాసివై నివసించియు। భాసురంబుగానునరవరదాసుపైఁగృపనుంచియు॥ శ్రీ॥

## కీర్తన 47.

పూలుగోయుదమా సద్గురుపాద పూజ సేయుదమా। వాలాయముగనరవరుఁడైన గురునిచేమేలుగనాత్మలోఁగీలుదెలుసుకొని - మూలస్థానమునందు ఫాలభాగమునందుఁజాలఁగఁబూసిన చంపకపున్నాగ॥ పూలు॥ తాపత్రయాదులఁదఱచి పళ్లెముఁజేసి కోపతాపంబులఁగోసి పాఱవేసిచూపుమధ్యమునందు సూత్రమైచెన్నొంది వ్యాపించినదిజ్యోతి రూపమౌచేమంతి॥పూలు॥పంచభూతంబులఁబాపుగఁ జేసియుఁ బంచాక్షరీమంత్ర ఫలమందు నూటియుఁగొం చెప్పుగుణములుకొమ్మలై విలసిల్లి-యుంచితభక్తితోనమరఁబూచినజాజి॥ పూలు॥ వన్నుగానుబట్టబయలందునిలిచియుఁ-దిన్నఁగఁగాచెను వెన్నెలలోపలఁగన్నులకం

దముగాఁ గనుపడుచున్న పున్నమ రేవెల్గుఁ బోలిపూఁచిన తుమ్మి॥పూలు॥ అండపిండాండ బ్రహ్మాండము తయుఁ దీఁగె దండిగసకల భూమండలముసుసాగె నిండు వేడుకతోను పుండరీకాక్షుచే నెండ వానల నానకుండఁబూఁచినమల్లె॥ కలియుగమున మట్టు పలి నరహరివీవై సలలితముగ నాత్మ సారముగనియున్న వలనొప్పఁగని నరవరదాసు నేలిన నరసింహామూర్తిఁ కానందముగఁబూగడ॥ పూలు॥

## కీర్తన 48.

సచ్చరాచరంబు నిబిడీకృతంబై సాక్షిగనుండున దదే కదా। నిశ్చయించి దేశిక నరవరులు దీక్ష పఱచిన దదే కదా॥ సచ్చ॥ అండపిండబ్రహ్మాండ భాండముల యావల వెలుఁగున దదేకదా। కుండలిరవము నఖండ తేజమై నిండ నిలిచిన దదేకదా॥ సచ్చ॥ ఎఱుపుతెలుపులై నలుపు నీల ములో వెల్గుచునుండున దదేకదా॥ సచ్చ॥ ఎఱుక మఱు పుల నెఱిఁగినవారికి నెప్పుడు చూపులో వెల్గదేకదా॥ సచ్చ॥ నాదబిందు కళరంగులు మీఱి యద్భుతసూత్రం బదేక దా॥ సచ్చ॥ వేదవేద్యులగు సాధుపురుషులకు। బోధఁజే సిన దదేకదా॥సచ్చ॥ ఎల్లలోకముల నేకచక్రముగ నేలుచు నుండున దదేకదా। ముల్లుగ్రుచ్చమటి సందు లేకముజ్జగ ములునిండిన దదేకదా॥ సచ్చ॥ రాకడపోకడ లేకను చలన ముగాకనునిలిచిన దదేకదా। సాకారంబును మీఱితన్ని రాకారంబైన దదేకదా॥సచ్చ॥ పట్టువిడుపులకాధారంబిది యని భ్రమలుడిగించిన దదేకదా। దిట్టముగను చరణాబ్జ హృదయమునబట్టబయలై వెల్గిన దదేకదా॥ సచ్చ॥

## కీర్తన 49.

ఏమి లేదేమి లేదు । సర్వమునం దింకేమి లే దేమి లేదు॥
ఈమహామహిమయు నేమహాత్ములుగన నామరూపక్రియ
నటన శూన్యమె కాని ॥ ఏ ॥ పంచభూతంబులను నెంచి
శోధించఁగను గొంచెమైనను గనుపించ దం దిందు
వను॥ నేమి లే॥ జ్ఞాతమనోబుద్ధి మాతమన్నను ప్రఖ్యాతిగఁ
జిత్తాహంకారమం దం దిందునను ॥ నేమి లే ॥ ప్రాణో
పాన వ్యానోదాన సమానములు కానరాకున్నద
భిమానమును మాను॥ మిం కే॥ ఇంద్రియంబులు బ్రహ్మవి
ష్ణ్వాదులును గూడి రవి చంద్రుల చోట్పటరమ్యమై యుండ ॥
రిం కే॥ శబ్దస్పర్శరూపరసగంధములను సబ్దముల్ వెదికినను
నక్కడక్కడ॥ నిం కే॥ ఇట్టిదట్టిదనుచుగట్టిగను మొట్టుట
కుమట్టుపలినివాసుని బట్టబయి లేగాని॥ ఇం కే॥ వాసిగను
శ్రీనరవరదాసుహృదయంబులో భాసిల్లుస్వయం ప్రకాశ
మంతయు॥ నిం కే॥

## కీర్తన 50.

ఏమని నేవిన్నవింతును - ఈమహాపరతత్వముఁ - భూమి
పైనిది దెలియుటే పరిపూర్ణసుజ్ఞానతత్వము॥ ఏ॥ పొంది
పొందక చెంది చెందక యుందియుందక యున్నది । ఇందునం
దునవందుముందున సందుగనపడకున్నది॥ ఏ॥ ఇంతటంత
టనెంతటంతట నింతవింతై యున్నది । చెంతగాకనునంత
రాలం బంత నిండి యున్నది॥ ఏ॥ ఇక్కడక్కడ నెక్కడనో
క్కపైతానున్నది। మిక్కుటంబుగఁ బిక్కటిల్లియు నిక్క

మై వెల్గొందది॥ ఏ॥ స్థూలమనకను సూక్ష్మమనకను దేలిక
గాకున్నది। కాలాకాలంబనక నిర్వికారమై వెల్గొందునది॥
శేషభాషలు దోషశోషణ లీషణంబులు లేనిది। దూష
ణంబునుభూషణంబులు పోషణంబులుగానిది॥ ఏ॥ ఇట్టి
దనకనునట్టిదనకను వట్టిదనకనెయున్నది। మట్టపలిపురప
ట్టణంబునబట్టబైలైయున్నది॥ ఏ॥ ఆశఁజెందక మోసమొం
దక నాశరహితంబైనది। వాసికెక్కిన కశారనరవర దాసు
హృదయంబైనది॥ ఏమని॥

### కందార్థము.

అందముగను బరిపూర్ణపుఁ। జందముగ నవలెనటంచు
సాధులువలుకఁగ। బొందిక చేఁగందుననుచు। సందేహము
వదలిగురుని సాధించినాను। ఆత్మను బట్టిశోధించినాను।అం
దముగానాదు బిందుకళాతీత మందే మోహముఁజెందిపొం
దె జీవములంచు సాధించినాను।ఆత్మను బట్టిశోధించినాను॥
క॥ ఇటుఁదెల్పెడు కృతిసారము। మాటుమాయము లేక
దీనిమర్మముగ నినఁగ। అటఁజేయకుటిలుఁ డటఁడే।
వటపత్రశయానుఁడంచుఁ బలుకఁగవలయున్॥

### మంగళహారతీ

హారతిచ్చికోరి మ్రొక్కరే - శ్రీహరునకుఁ జయ॥హా॥
హారతిచ్చి వేడరే శుభధీయుఁడై పరఁగెడుగురునకు। సార
సాక్షులార మీరు చేరియును గర్పూరమ్ము [illegible] హార॥
గంధమును బన్నీరునత్తరు - సుందరము సుగంధ [illegible]
లందముగ ధరియించి మీరలు సందిడఁగ జయాజయ య
టంచును॥ హా॥ పట్టువస్త్రాభరణములను - దిట్టముగ వల

వాటుశాల్వాలు - గట్టిగాధరియించి పాదముఁ-బట్టిమీరలు చుట్టునిలుచుక॥ హారతి॥ పప్పుదప్పళమరిసెబూరెలు-నొ ప్పుగనుపద్రసపాకము - మెప్పుగాభుజియింపఁజేసి తప్పు దీర్చుమాయప్పయనుచు॥ హారతి॥ పంచమూలితునకు - శ్రీధర - కంచిపురనివాసునకు - శుభమంచుమిక్కిలిభక్తి చేసేవించిహారు భజించుచుజయ॥ హా॥ మంగళంబనిపాడ రే - శ్రీగంగగౌరీవల్లభునకు। రంగుగాద్రికూట నిలయ లింగమై వెల్గెడుస్వామికి॥ హారతి॥ హద్దుమీఱకనుసద్గురు- బుద్ధిచేవర్జించిమాయను - గుద్దివేసియాత్మను బరిశుద్ధిగా దగ్గించిశుభజయ॥ హా॥ ధారుణిచరణాబ్జదాస - ధీరుని సరిసముమీరగలు - కోరిపరమానందసుఖము పారముట్టి జయసుఖంబని॥ హారతిచ్చి॥

## సీసపద్యం.

శ్రీరమ్యముగగురు శ్రీ చరణములువ్రాల్ కమలమం దునజతగానుబట్టియుగమరలేకను సురవందితార్యునిమతి మతినేఁగొల్తుమనముఁబెట్టి। మురహరుకరుణచేఁబరముఁ జెందునుకవి సరవరుఁడైన సుందరునిఁబట్టి। గుతిచేతఁదన లోనగురులేలక రొమ్మెఁగి గుత్రించి తతిగెడుగుట్టుఁబట్టి। రొమ్ముకమలుపుల రెంటిని నలమెఁగట్టి। శరణువేఁడిపరమ భక్తవరులఁబట్టి॥ దాసచరణాబ్జ దానుఁడధరణిఁబుట్టి। కర లఁజేసినిమురుబోధ కృతులుగట్టి॥